Regd. No.
H. NL. 88
సంపుటి: 56
సంచిక: 21

# జమీన్ రైతు

స్థాపకులు : నెల్లూరు వెంకట్రామానాయుడుగారు

24-5-85
శుక్రవారం
14 పేజీలు
75 పైసలు.

సంపాదకుడు : నెల్లూరు శ్రీరామమూర్తి


"పరిశుద్ధమైన పరిపాలన... అవినీతి నిర్మూలన"

## కోట్లఆస్తులకొనుగోలు?

మార్చిలో జరిగిన శాసనసభ ఎన్నికలలో ఘనవిజయాన్ని సాధించి రెండవ సారి అధికారంలోకి వచ్చినతర్వాత తన కుటుంబానికి మరిన్ని ఆస్తిపాస్తులు సమకూర్చుకోవడంపైన ముఖ్యమంత్రి శ్రీ ఎన్.టి. రామారావు ప్రధానంగా దృష్టిని కేంద్రీకరించినట్లు కనిపిస్తున్నది. హైదరాబాద్ నగరంలో ప్రధానమైన సెంటర్లలో ముఖ్యమంత్రి శరవేగంతో ఆస్తులను ఖరీదు చేస్తున్నారు. ఆయన కొనుగోలు చేస్తున్న పద్ధతి చూస్తూ "అవకాశం నిజాం అనిపించుకోవాలని తాపత్రయ పడుతున్నట్లున్నారు" అని రాజకీయ వర్గాలవారు వ్యాఖ్యానిస్తున్నారు.

ముప్పై ఏండ్ల సినిమా జీవితంలో అంతులేని ధనరాసులను కూడబెట్టుకున్న శ్రీ రామారావు ఆస్తులను కొంటుంటే ఎవరికి బాధ ఉండనక్కరలేదు. ఆ విధంగా కొనేహక్కు ఆయనకు ఉంది. కాని ముఖ్యమంత్రి పదవిలో ఉంటూ వ్యక్తిగతంగా ఆస్తుల కొనుగోలుకోసం అధికారులమీద, ప్రభుత్వయంత్రాంగంమీద శ్రీ రామారావు ఒత్తిడి తెస్తున్నారని వస్తున్న వార్తలవల్ల రాజకీయవర్గాలవారు విస్మయాన్ని వ్యక్తంచేస్తున్నారు. 1983లో తొలిసారిగా అధికారంలోకి వచ్చిన తర్వాత వారాలంలో అక్రమం కట్టడానికి ముఖ్యమంత్రి అధికార దుర్వినియోగానికి పాల్పడ్డారని స్పష్టమైన ఆరోపణలు వచ్చాయి. వారంలో పాము కనిపించిందనే నెపంతో అక్కడికి వెళ్ళకుండా ముఖ్యమంత్రి తిరిగి అబిడ్స్ నివాసానికి వచ్చారు. ఆ తర్వాత గండి

* సాగర్‌టాకీస్ కాంప్లెక్స్
* రాయల్ హోటల్ లాడ్జి సముదాయాలు
* హర్ష హోటల్
* కొడుకు పేరుతో పార్టీకి 30 గదుల భవనం
* డి. బి. ఆర్. మిల్లు స్థలం 25 ఎకరాలు
* వసంత విహార్ కొనుగోలులో తటపటాయింపు!

పేట ఆశ్రమ నిర్మాణానికి ప్రయత్నాలు ప్రారంభించారు. ఈ ఆశ్రమం చుట్టూ రక్షణకోసం ముళ్ళ కంచె వేయడానికి అరులక్షల రూపాయలు మంజూరుచేసే ప్రతిపాదనను ఆర్థిక మంత్రిగా తాను అంగీకరించకపోవడం వల్లనే తనకు శ్రీ రామారావుకు సంబంధాలు దెబ్బతిన్నాయని శ్రీ నాదెండ్ల భాస్కరరావు ప్రకటించిన సంగతి తెలిసిందే. తర్వాత శ్రీ భాస్కరరావు పార్టీ చీలిపోయి ప్రభుత్వాన్ని ఏర్పాటు చేసి నెలరోజుల్లోనే పదవీచ్యుతి పొందారు. శ్రీ రామారావు ఎన్నికల అనంతరం తిరిగి పదవిలోకి రాగానే ఓంప్రథమంగా గండిపేట ఆశ్రమంలోకి ప్రవేశించారు. తర్వాత మార్చి నుంచి ఏప్రిల్ వరకు ఆయన చకచకా ఆస్తులను కొనేశారు. ముఖ్యమంత్రి ఆస్తుల కొనుగోలు వ్యవహారం అబిడ్స్‌లోని ఆయన ఇంటి ముందున్న సాగర్‌టాకీసు కాంప్లెక్సును కొనడంతో ప్రారంభమయింది. ముఖ్యమంత్రి కాకముందునుంచే ఈ భవనాన్ని కొనడానికి ప్రయత్నిస్తున్నప్పటికి ఆయన ప్రయత్నాలు ముఖ్యమంత్రి అయ్యాకనే సఫలం అయ్యాయి. సుమారు రెండుకోట్లు విలువచేసే ఈ కాంప్లెక్సును సుమారు 30 లక్షల రూపాయల ఖరీదుకే ముఖ్యమంత్రి కొన్నారని తెలుస్తున్నది. కొనుగోలు ప్రయత్నంలో కలిసిరాని ఒక సబ్‌రిజిస్ట్రార్ ముఖ్యమంత్రి ఆగ్రహానికిగురై బదిలీ అయ్యారని తెలిసింది. సాగర్‌టాకీస్ కాంప్లెక్సు విలువను పాతిక లక్షల రూపాయలుగా వెలకడుతూ రిజిస్ట్రేషన్ చేయాలని ముఖ్యమంత్రి అదే

—కొనసాగింపు 8 వ పేజీలో

"మార్క్సిస్టు మహర్షి" దివంగత సుందరయ్యగారు

(సంపాదకీయం – 4వ పేజీలో)

### వచ్చేవారంమొదలు

## 50 ఏళ్ళనాటి 'జమీన్ రైతు' నుండి

31-5-85 సంచిక మొదలు యాభై ఏళ్ళనాటి 'జమీన్ రైతు'లోని విశేషాలు ఇవ్వబడుతాయి. స్థానిక వార్తా విమర్శలకు 'నెల్లూరు ముచ్చట్లు'గా వుంటున్న శీర్షిక ఆనాడు "నెల్లూరిడైరీ"గా వుండేది దాని లేఖకుడు రామానాయుడుగారే. -సం.

# పినాకినీ తీరం

## జి. కాం. అధ్యక్షతా?

### నాకా? వద్దు వద్దు!

మొన్నొక దినపత్రికవారు ఫోన్ చేశారు-మీరు జిల్లా కాంగ్రెస్ అధ్యక్షుడు కాబోతున్నారని వార్త వచ్చింది; చెప్పకుండా దాగుందని చెప్తున్నాను అన్నాడాయన. ఎవరు చెప్పారు? అని అడిగాను. నాకు హైదరాబాదు నుండి తెలిసింది; ఇక్కడా చెప్తున్నారు అన్నాడాయన. అది నిరాధారమైన వదంతి; వేబు ను లోక వూహాగానం; దయచేసి దాన్ని ప్రకటించవద్దని వర్తమానం పంపండి అని నేనాయనను కోరుకున్నాను. అతను నా కోర్కెను మన్నించాడు.

అంతకుముందు ఇంకో దినపత్రికలో కూడా వచ్చింది. జనార్దనరెడ్డి కాకుంటే శ్రీరామమూర్తి అని.

అసలు వాళ్ళకు తెలియకుండా వీళ్ళకు ఎట్లా వాసనవస్తుందో నాకు ఆశ్చర్యం. జిల్లాకాంగ్రెస్ అధ్యక్షతపట్ల ఆసక్తి గాని, ఆ బరువుబాధ్యతలు మోసేశక్తి గాని నాకు లేవు. నిష్కర్షగా చెప్పాలంటే ఆ పదవికి నేను అర్హుణ్ణికూడాకాదు. దానికి అర్హులు చాలమంది వున్నారు; వారిలో ఎవరికైనాఇవ్వాలి అది. నా అభిప్రాయంలో ఇప్పుడు జనార్దనరెడ్డి ఒక్కడే జిల్లాలో కాంగ్రెస్‌కు న్యాయం చేయగలడు. ఆయన కర్తీ కాంగ్రెస్ వాదికాదు; అవకాశవాదికాదు. అవిశ్రాంతంగా కాంగ్రెస్ పునరుజ్జీవనానికి పని చేస్తున్న వ్యక్తి. ఈమాటనేనంటే జనార్దనరెడ్డి పట్ల అభిమానంతోనో, పక్షపాతంతోనో చెప్తున్నానని ఆపాదిస్తారు. నమ్మండి నమ్మకపోండి; కాంగ్రెస్ శ్రేయోదృష్టితో హృదయపులోతులనుండి విశాలభావంతో చెప్తున్నమాట ఇది.

నేను కాంగ్రెస్‌వాదినే; అందులో సందేహంలేదు. కాని ముందు జర్నలిస్టును; ఆతర్వాత ఏదైనా. జర్నలిస్టుగా వుండడం, జర్నలిస్టుగా పిలవబడడమే నా అభిమతం, నాకు ఆనందం.

### కృతజ్ఞత

అన్నీ స్వంతవిషయాలు వ్రాసుకోవలసివస్తున్నందుకు పాఠకులు నన్ను క్షమించాలి. ఒక్కొకసారి అవి తప్పవు; స్వోత్కర్షగామాత్రం చెప్పుకోవడంలేదని మనవి.

నెల్లూరులో నన్ను సన్మానం చేస్తానని పాత్రికేయులొకరన్నారంటే నాకే సంభ్రమాశ్చర్యాలు కలిగాయి. తిట్లు, అవమానాలు, ఆక్షేపణలు, ఆరోపణలు, దుమ్మెత్తిపోయడాలు తప్ప, నా విషయంలో ఇంతవరకు ఒక్క పాత్రికేయుడికైనా సదభిప్రాయం వున్నట్లు దాఖలాలేదు. జర్నలిస్టుగా నేను వివాదగ్రస్తవ్యక్తిని; కాని ఏ పాత్రికేయుడి విషయంలోనూ నాకు దురభిప్రాయం లేదు; అసలు వారివిషయమే పట్టించుకోను. అటువంటి నన్ను ఎందుకు ద్వేషిస్తారో నాకు ఆశ్చర్యం కలుగుతుంటుంది.

కనపత్రిక వార్షికోత్సవ సందర్భంలో అభిమానంతో ఆదరంతో సన్మానానికి పిలిచిన ఆ సంపాదక మిత్రుడికి కృతజ్ఞత చెప్పుకుంటున్నాను. సన్మానాలు, సత్కారాలు ఎందువల్లనో నా స్వభావానికి విరుద్ధం; పైగా అంతటి అర్హతకూడా నాకులేదు. అందువల్ల ఆమిత్రుడు క్షమించాలి.

### అరణ్యరోదనం!

ఉదయగిరి సమితి అధ్యక్షుడు శ్రీ ఎం. వి. నారాయణరెడ్డిది ఎప్పుడూ అరణ్యరోదనమే. అరచి అరచి కంఠశోష, వ్రాసి వ్రాసి చెయ్యి నొప్పి తప్ప ఫలితం వుండదు. కాని నారాయణరెడ్డి నిరుత్సాహపడేవాడుకాడు; మొండి ఘటం.

సమితి సమావేశాలకు అధికార్లు రావటం మానివేశారట; అందువల్ల సమితిలోని సమస్యలు అధికార్ల అవగాహనకొచ్చే అవకాశం లేకుండా పోతున్నదని; సమితిలోని గ్రామాలు తీవ్రమైన నీటిఎద్దడిని ఎదుర్కొంటున్నాయని, 24 తేది సమితి సర్వసభ్య సమావేశంలో ఆ సమస్య చర్చించబడుతుందని, ఆ సమావేశానికైనా హాజరు కావలసిందిగా ఆయన అధికార్లను ప్రాధేయపడుతున్నాడు.

ఆమధ్య ఇందుకూరుపేట సమితిలో సమకుంటాను, స్థాయిసంఘ సమావేశాలకు బి. డి. ఓ గారే హాజరుకావటంలేదట. కారణం ఏమయ్యాఉంటే, ఆరోజే కలెక్టరమ్మగారు ఇంకేదో పనిపెట్టారట. సమితిస్థాయి సంఘాలంటే కలెక్టరమ్మ ఆజ్ఞ ముఖ్యమైంది బి. డి. ఓ. గారికి; లేకుంటే తోలుతీస్తుందని భయం. కాని బి. డి. ఓ గారు ఆరోజు స్థాయిసంఘ సమావేశాలున్నాయని కలెక్టరు గారికి చెప్పివుంటే, ఆమె అతనికి ఆరోజు వేరే బాధ్యతలు అప్పగించివుండదని నా అభిప్రాయం. కాని ఆమాట చెప్పడానికి కూడా భయపడివుంటారు. ఏమి గజిటెడ్ ఆఫీసర్లో, ఎత్తుడాకమోమరి.

నారాయణరెడ్డి అధికారులపట్ల దురభిప్రాయపడుతున్నట్లుంది; అది పొరపాటని నా అభిప్రాయం. వారికి కలెక్టరమ్మగారు ఏర్పాటుచేసే సమావేశాలు చాలా వుంటున్నాయి; అవిగాక ఆమె అప్పగించే బాధ్యతలూ వుంటున్నాయి. వారు వాటికి హాజరు కావాల్నా, ఆమె చెప్పిన పనులు చేయాల్నా; లేక వాటిని త్రోసిపేసి సమితి సమావేశాలలో పాల్గొనాల్నా? ఈ సంకటస్థితి వల్లకాకుంటే ఇదివరకు క్రమంగా సమితి సమావేశాలకు హాజరవుతుండినవారు ఇప్పుడెందుకు మానేస్తారు? అధికారులపట్ల సానుభూతితో పరిశీలించవలసిన విషయంకాదా ఇది?

కలెక్టరమ్మగారే ఉత్తరువులు జారీ చేయాలి; సమితిసమావేశాలకు అన్నిటికీ కాకపోయినా, అప్పుడప్పుడైనా హాజరు కావలసిందిగా ఆదేశించాలి, అంతేకాదు, సమితి స్థాయిసంఘసమావేశాలున్నపుడు, బి. డి. ఒ లకు ఇతరపనులు పెట్టడం కూడా ఆమె మానుకోవడం బాగుంటుంది.

### తెలుగుదేశం

### రాజకీయాలు

తెలుగుదేశం పార్టీకి తాత్కాలికంగా జిల్లాకమిటీ ఒకటి నియమించబడింది. గూడూరు సమితి ప్రెసిడెంటు శ్రీ ఎల్లసిరి శ్రీనివాసులురెడ్డి కన్వీనరు; మరో ఎనిమిదిమంది సభ్యులు. నెలరోజుల్లో "ఎన్నికలు" జరుపుతారట; ఇంతలోనే ఈకమిటీ ఎందుకోమరి.

ఎల్లసిరి శ్రీనివాసులురెడ్డి కాబట్టేకాదు, కమిటీ నియామకంమీద మంత్రి శ్రీ శ్రీనివాసులురెడ్డి ప్రభావమే ఎక్కువంటారు. ఆతర్వాత గంగాధరంగారి అనుయాయులు ఒకరిద్దరున్నారట; ఆనం వాకి బందిసున్న అవి అపార్టీవర్గాలవారి మాట, అపార్టీలోని మోహాలన్నీ కొత్తవి; అందువల్ల ఎవోటివాడికి ఎవరైనా చెవికేకప్పు ఎవరు ఎవరివర్గం అనేది తెలియదు.

శ్రీనివాసులురెడ్డి- ఆనంవాళ్ళ మధ్య ఏదో సయోధ్య కుదిరిందన్నారు. రామానాయుడుగారి మాటల్లో అది వుత్తమిథ్యేనా? జిల్లా నాయకత్వం గంగాధరం గారిదన్నారు; అదికూడా మరొకమిథ్యేనా? 'ఎన్నికలు' అయిన తర్వాతకాని అసలు విచిత్రాన్ని మనం చూడలేమేమో! ఏమైనా ఆనంవాళ్ళు, సరైనమాట వుపయోగిస్తే పక్షంగా వుంటుందికాని అటు ఇటు కాకుండాపోయారేమో అనిపిస్తుంది.

యల్లసిరి శ్రీనివాసులురెడ్డి చురుకైనవాడు కావచ్చు; విశ్వాసపాత్రుడు కావచ్చు, మంచివాడూకావచ్చుకాని జిల్లా పార్టీ కన్వీనరత్వానికి అర్హతున్న దాటా ఆయనకు? తెలుగుదేశంకు అన్ని విషయాల్లో కాంగ్రెస్‌దేమావా? మాటలలోనే తేడా.

# జమీన్‌రైతు

## మార్క్సిస్టు మహర్షి

ఆదివారం ఉదయం మద్రాసులో తన 72 వ ఏట దివంగతులైన పుచ్చలపల్లి సుందరయ్యగారు రాజకీయవాది కావచ్చు! మార్క్సిస్టు కమ్యూనిస్టు కావచ్చు: సాయుధపోరాటానికి సర్వసైన్యాధ్యక్షులుగా వ్యవహరించిన తీవ్రవాది కావచ్చు; కాని వ్యక్తిగా ఆయన ఆదర్శప్రాయుడు, ఋషితుల్యుడు, చేయెత్తి నమస్కరించదగిన మహోన్నత పురుషుడు. ఆయన్ను మార్క్సిస్టు మహర్షి అన్నా అతిశయోక్తికాబోదు.

చిన్ననాటినుండి నీతి నిజాయితీలతో కూడిన నడవడిలో, స్వార్థచింతనలేని జీవితవథంలో, సేవా త్యాగాలు, నమ్మిన సిద్ధాంతంతో ప్రజాభ్యుదయానికి సర్వం త్యజించి జీవితాన్ని అంకితం చేసిన మహనీయులు ఎందరో వుండరు. ఆ కొద్దిమంది ఆదర్శ పురుషులలో సుందరయ్య ఒకరు కావడం; ఆయన ఆంధ్రుడు, నెల్లూరు మండలీయుడు కావడం మనకు గర్వకారణం.

తాను నెల్లూరు జిల్లా వాడైనా సుందరయ్యగారు అమరుపేరులో లేదో మనకు తెలియదు; కాని తెలుగువారు ఆయన్ను నెల్లూరువాడిక్రింద జమకట్టలేదు; అట్లనే భారతీయులూ ఆయన్ను ఆంధ్రదేశానికి పరిమితం చేయలేదు. ఆయన ప్రాంతాలకు, భాషలకు అతీతుడైన వ్యక్తి; భారత జాతి అంతటికీ చెందిన వ్యక్తి. అట్లనే ఆయన మార్క్సిస్టు కావచ్చు; కాని వ్యక్తిగా పార్టీలకు, వర్గాలకు, కులాలకు మతాలకు అతీతంగా అందరి గౌరవాభిమానాలకు పాత్రుడు, సర్వప్రియుడు, అజాతశత్రువు.

ఆయన తొలుత కాంగ్రెస్‌వాదే: 1930 ఉప్పుసత్యాగ్రహంలో మొట్టమొదటి బృందంలో జైలుకుపోయిన వ్యక్తి. ఆయన జన్మతః అతివాదేమో, జయప్రకాష్ నారాయణ్‌గారి కాంగ్రెస్ సోషలిస్టు పార్టీ ఆయన్ను ఆకర్షించింది; బహుశా ఆ పార్టీ రాష్ట్ర సంఘం సుందరయ్యగారి అధ్వర్యంలోనే వుండింది. ఆయన అకస్మాత్తుగా కమ్యూనిస్టు అయిపోయాడు; ఆంధ్రలో కాంగ్రెస్ సోషలిస్టు పార్టీ కూలిపోయింది రాష్ట్రంలో పార్టీ పతనానికి సుందరయ్య కారకుడని జయప్రకాష్ ఆ రోజుల్లో నిందించినట్లు కూడా అనేవారు. సుందరయ్య కాంగ్రెస్ సోషలిస్టుపార్టీని దెబ్బతీశాడని చెప్పడానికి ఈ సంఘటనను ప్రస్తావించడంలేదు; రాజకీయంగా సుందరయ్యగారు మొదటినుండి అతివాదంవైపు, తీవ్రవాదంవైపు ఆకర్షించబడుతుండినాడని చెప్పడానికే.

ఆయన మార్క్సిస్టు; కాని వారిలో కూడా భిన్నమైనవ్యక్తి. కమ్యూనిస్టులలో సైతం వ్యక్తిగతమైన ఆడంబరాలు, విలాసాలు, సుఖభోగాలు చోటుచేసుకున్నాయి; వ్యక్తిగత జీవితంవేరు, వేదికమీద వల్లించే ఆదర్శాలు వేరుగా వుంటాయి, కొందరు ఆక్షేపించవచ్చునేమోకాని కమ్యూనిస్టులలోకూడా అవి ఏవి వంటి దుర్లక్షణాలు పొడచూపకుండా పోలేదు. కాని సుందరయ్యగారు మాత్రం వ్యక్తిగత జీవితంలో, పరివారంగంలో స్వచ్ఛమైన వ్యక్తి; వేలెత్తి చూపదగిన లొసుగులేని నిష్కళంకుడు. నచ్చరిత్రుడు సిద్ధాంత రీత్యా ఆయన నిర్మొగమాటి, లొంగుబాటులేని వ్యక్తి, ఆ విషయంలో ఎవరితోనూ, ఎందుకూ రాజీయేలేదు, కాని ఎదుటివాడి వాదనలో, చర్యలో సమంజసత్వం వుంటే, న్యాయంవుంటే కమ్యూనిస్టు సిద్ధాంతరీత్యా దాన్ని అంగీకరించడానికి వీలులేకపోయినా, వ్యక్తిగతంగా సమర్థించే సహృదయత, విశాలభావం ఆయనలో వుండేవి; అందువల్లనే రాష్ట్రంలో ఏ పార్టీ ప్రభుత్వం వున్నా ప్రతి ముఖ్య సమస్యమీద సుందరయ్యగారి సలహా తీసుకునేవారు; ఆయన సలహాను అమూల్యంగా భావించేవారు, అనేక సమయాల్లో, చట్టసభల్లో, ఇతర వివిధ విషయాల్లో ఆయన సలహాలు పాటించేవారు. సుందరయ్యగారిది నటయమన దృష్టి కాబట్టే, అందరికీ ఆయన పలహా మీద గౌరవం, నమ్మకం. మరే రాజకీయ పార్టీ నాయకుడు సుందరయ్యగారివలె రాజకీయాలకు అతీతమైన ప్రేమ గౌరవాలు పొందలేదేమో ననిపిస్తుంది.

ఆ నిష్కళంక విరాడంబర ప్రజాసేవకునికి; జీవితకాలంలో ప్రతిక్షణాన్ని, శరీరంలోని ప్రతి అణువును సార్థకం చేసుకున్న ఆ ధన్యజీవికి జోహార్లు చెప్తున్నాము.




# క్షయాసుపత్రిని టవున్‌కు దూరంగా తరలించాలి!

నెల్లూరు టి.బి. ఆస్పత్రిలో మరొక 10 లక్షల రూపాయల వ్యయంతో నూతన భవనాలు నిర్మిస్తున్నట్లు తెలిసింది. అయితే అసలు టి.బి. ఆస్పత్రినే టౌనుకు దూరంగా తరలించడం అవసరమన్న అలోచన అధికారులు, అనధికారులలో చాలాకాలంనుంచి వుంది.

ఎప్పుడో 30 సంవత్సరాల క్రితం కట్టించిన ఆస్పత్రిని, అప్పట్లో నెల్లూరు టౌను కస్తూరిదేవి విద్యాలయం వరకే పరిమితమైవుండేది. దర్గామిట్ట వసతం నిర్జనంగా, అడవివలె వుండేది, ఆ రోజుల్లో క్షయ అంటే అంటురోగమని, నయంకాని వ్యాధి అని భావించేవారు. అందువల్లనే ఊరికి దూరంగా వెలివేసినట్టువుండే ప్రాంతంలో ఆస్పత్రి కట్టారు.

ఇప్పుడు టి.బి.ని డాక్టర్లు సులభంగా నయం చేయగల్గుతున్నప్పటికీ, అది ఇంకా అంటురోగంగానే పరిగణింపబడుతున్నది. అటువంటి పరిస్థితులలో టి.బి. ఆస్పత్రి క్రిక్కిరిసిన జనవాసాలమధ్య వుండడం ఆరోగ్యప్రదం కాదు. ఇప్పుడు ఆస్పత్రి ఆవరణంలో తప్ప దానికి అనుకొని గజంస్థలం ఖాళీ వదలకుండా ఇళ్ళుకట్టారు; స్కూళ్లుకూడా వెలిశాయి; హోటళ్లు నడుస్తున్నాయి. రోగులు, ప్రజలు సహజీవనం చేస్తున్నారు. దీనిఫలితంగా ఆ ప్రాంతం పిల్లలలో రోగంయొక్క ప్రాథమిక లక్షణాలు కన్పిస్తున్నాయని కొందరు డాక్టర్లు చెప్తున్నారు.

జనం పెరగడంతో, మోటారు వాహనాల రద్దీ పెరగడంతో వాతావరణంకూడా కలుషితమౌతుంది. ఇది రోగులకు మంచిదికాదు.

ఈ పరిస్థితులలో ఆస్పత్రిని పొదలకూరు రోడ్డులో టౌనుకు దూరంగా వున్న అటవీ ప్రాంతానికి తరలించి, మదనపల్లి వలె శానిటోరియంగా అభివృద్ధి చేయడం అవసరం. అందుకు ఎటువంటి ఆటంకం కూడా ఎదురుకాదు. ప్రస్తుతం ఆస్పత్రి విస్తీర్ణం 29 ఎకరాలు. దీనిని విక్రయిస్తే కనీసం రెండు కోట్లరూపాయలు వస్తుంది. ఆనిధులతో దేశంలోకెల్లా ఆధునికమైన శానిటోరియం నిర్మించవచ్చు. అది వీలుకాని పక్షంలో భవనాలకొరత ఎదుర్కొంటున్న పలు ప్రభుత్వశాఖలకు ఈ స్థలం వాడుకోవచ్చు. అంతేతప్ప అపరేశ్రమాదకరంగా పరిణమించిన ఆస్పత్రిని ఇంకా అక్కడే అభివృద్ధి చేయడం ఎవరికీ క్షేమం కాదు.

- కలవకూరు చంద్రశేఖరరెడ్డి
మాజీ మునిసిపల్ కౌన్సిలర్
నెల్లూరు

### చిల్లరకొరత ఎప్పటికీ వుండాల్సిందేనా?

నెల్లూరులో చిల్లరనాణెంకొరత రోజురోజుకు ఎక్కువవుతూంది. ఇటీవలి వరకు దేశమంతా చిల్లరకు కటకటలాడిపోయినా నెల్లూరులో పరిస్థితి తీవ్రంకాలేదు. ఇప్పుడిప్పుడు నెల్లూరులో సైతం చిల్లరకొరత ప్రారంభమవుతుంది. బస్సుల్లో బంకుల్లో హోటళ్లలో ప్రతిపౌరుడు నిత్యం ఈ సమస్యను ఎదుర్కొంటున్నాడు. చిల్లరకొరత చేతులారా పైసల్లోనే అయినా అధికమొత్తం పోగొట్టుకోవలసి వస్తుంది. హోటళ్ళలో మాత్రం సంచులలో నాణేలు కనిపిస్తున్నాయి.

ఇటీవల ఒకటి రెండు రూపాయల కాగితాల కొరతకూడా ఎదురౌతూంది. వ్యాపారులు కొందరు కొనుగోలుదారులకు చినిగిపోయిన కాగితాలు అంటకడుతున్నారు; అవి తిరిగి మార్చుకోవడానికి ఎవరూ తీసుకోవడంలేదు.

అఫ్టరాల్ చిల్లర నాణ్యాలను కావలసినన్ని ముద్రించలేని దౌర్భాగ్య పరిస్థితిలో వుందా భారతప్రభుత్వం? ఇది దేశానికే అవమానకరమైన విషయంకాదా?

నెల్లూరు —పి. శ్రీనివాసులు

### మొలగొలకులకు సువాసనా?

17 తేది 'జమీన్‌రైతు' లో ఒక రైతు ప్రకటన చూస్తే ఆశ్చర్యమే కాదు ఆవేదనకూడా కలిగింది. ఎందుకంటారా విషయ పరిజ్ఞానం లేకుండా, లేని గుణాలను ఆపాదించి రైతులను పెడదారి పట్టించడంగా వున్నందుకే.

ఎమ్. ఎల్. ఆర్. 27999 క్రొత్త మొలగొలకులకు రకం ఆర్.పి. 31-49-2, సన్నమొలగొలకు (బి. పి. ఐ. - 1) సంకరంతో తయారు చేయబడిన రకం. దీనికి సన్నమొలగొలకుల నాణ్యతరాలేదు. 9672 కు దీనికి తేడా ఈ కొత్తరకం అగ్గితెగులకు తట్టుకొంటుంది; 72 వలె

—కొరవ 8వ పేజీలో

ఊరు-పేరు

వావింటపర్తి కృష్ణరావు

# 'తలపుల' వూరా తలుపూరు?

తలుపూరు అనే పూళ్ళు రెండున్నాయి. ఒకటి రాపూరు తాలూకాలో తుమ్మలతలుపూరు. గూడూరు తాలూకాలో కాగితాలపూరు. ఈ విధంగా రెండు తలుపూర్లు వుండుటచేత విశేషణం తగిలించి తుమ్మల తలుపూరు, కాగితాలపూరు (కాకితలుపూరు) అనివ్యవహారంలోకి తెచ్చారు.

కందుకూరు తాలూకాలో నలదలపూరు, మధ్యప్రదేశ్‌లో బస్తర్‌జిల్లాకు ముఖ్యపట్టణమైన జగదలపూరు అనే పూళ్లున్నాయి. వీటికంతా మూలం తలంపు; అంటే ఆలోచన. ఆలోచించి పనులు చేసేవారుండే పూళ్ళు అనుకోవచ్చు. జగదలపూరు అంటే జగత్-పరిశీలనాన్ని గురించి ఆలోచించే వారి పూరనుకోవచ్చు వీటి అర్థాలు వేదాంత పరంగా అనిపిస్తున్నాయి.

**తుమ్మల తలుపూరు**

ఇది రాపూరు తాలూకాలో వుంది. పైకాగమంతు ప్రసిద్ధిచెందిన పూరు ఈ గ్రామానికి సంబంధించి ఒక కథ చెబుతారు. ఈ గ్రామం 20 సంవత్సరాల ముందు తుమ్మచెట్లతో నిండివుండేదట. ఆ గ్రామానికి చెందిన కంపుల నాయుడు అనే వృద్ధుడు, ఆవులను, గొర్రెలను మేపుకుంటూ ప్రతిదినం శివపూజ చేయకుంటా వుండే వాడట. కార్తీకమాసంతో మూడురోజులు కుంభవృష్టి కురిసి సూర్యదర్శనం లేకుండెనట. ఆ వృద్ధుడు సూర్యదర్శనంలేనిదే ఆహారము తీసుకునేవాడు కాదట. ఆ మూడు దినములు సూర్యదర్శనం కొరకు వేచిచూస్తూ, వేపచెట్టు క్రింద పడుకొని తలంపు చేయుచుండగా, శివుడు ప్రత్యక్షమై అతనితో 'నీ ప్రక్కన చిన్న తుట్ట చెట్టుంది. దాన్ని తొలగిస్తే ఒక శివలింగం కనిపిస్తుంది. చుట్టు ప్రక్కల చెట్లు కొట్టివేసి నేల చదరపెట్టి, పూరు నిర్మించమని' శివుడు ఆజ్ఞాపించాడట. వెంటనే సూర్యోదయం కావటం, శివలింగం దర్శనం కావడం జరిగిందట. ఆ తలంపుల నాయుడు వెంటనే పూరు నిర్మాణం ప్రారంభించి దేవాలయాన్ని కూడా నిర్మించాడట. తలంపుల నాయుడు పేర తలుపూరై, తుమ్మచెట్లుపుండుటచేత తుమ్మల

మిగతా 11వ పేజీలో

# చక్కెర ఫ్యాక్టరీ ఎం.డి. వైఖరి-రైతుల అసంతృప్తి, ఆగ్రహం!

అధికార్ల మిడిసిపాటు, దురహంకారపు వైఖరిఅందోళనలకు అసంతృప్తులకు దారితీస్తుంటుంది. అధికారి నెమ్మదస్తుడైతే సమస్యలు పెద్దవైనా చల్లగా తేలిగ్గా పరిష్కారమైపోతుంటాయి అధికారి వికటంకుడైతే చిన్నసమస్యకూడా పెద్దదై అనవసర గొడవలకు దారితీస్తుంటుంది. నెల్లూరు సహకార చక్కెరఫ్యాక్టరీ మేనేజింగ్ డైరెక్టరుగా పశ్చిమ గోదావరిజిల్లా భీమడోలునుండి వచ్చిన శ్రీ అరుణకుమార్ మానే దురుసుతనం చెరకు రైతుసంఘం ఏర్పాటుకు కారణం కావడమేకాకుండా, వారిని ఆందోళనకు కూడా పురికొల్పుతున్నట్లుంది.

రైతులపట్ల అరుణకుమార్‌గారి వైఖరిని గూర్చి ఈరోజు కొత్తగ వివరించలేదు; చాల రోజులనుండి పెక్కుమంది రైతులు పలువిధాలుగా చెప్తూనే వున్నారు; పత్రికలో వ్రాయమని కోరుతూనేవున్నారు. కాని శృతిమించితే తప్ప ఎట్లా తొందరపడగలం? ఆయన రైతులను చీమలు, దోమలుగా చూస్తున్నాడట; నోటికొచ్చినట్లు మాట్లాడుతున్నాడట; చెరకు రైతులకు జవాబుచెప్పవలసిన అవసరం తనకు లేదంటున్నాడట; అఫ్తాల్ రైతులదేముంది, ఎంతుంది, కోట్లాది రూపాయల ప్రభుత్వ ఆస్తికి తాను అధిపతిననుకున్నాడట; తనను రైతులెవ్వరూ ఏమీ ప్రశ్నించడానికి లేదంటున్నాడట; తాను భీమడోలు సహకార చక్కెర ఫ్యాక్టరీని మూతవేయించి వచ్చిన వీరుణ్ణి మీసాలు తిప్పుతున్నాడట, ఇవన్నీ ఆయనను



గూర్చి రైతుల ఆగ్రహంతో, ఆవేదనతో చెప్తున్న మాటలు. ఒకరిద్దరైతే ఏవో స్వంతకారణాలతో దురుద్దేశ్యంతో చెప్తున్నారనుకోవచ్చు; ఎవరినోటవిన్నా ఒకటేమాట అయినపుడు నమ్మకుండడం ఎట్లా?

రైతులు చెప్పడంలో చెరకు అభివృద్ధికి, చెరకురైతు సంక్షేమానికి ఎం.డి. ఎటువంటి ప్రోత్సాహకచర్యలు తీసుకోకపోగా, తన నివాసభవనాల, వాహనాల వగైరాలమీద విపరీతంగా ఖర్చు పెడుతున్నారని వారు ఆరోపిస్తున్నారు. ఎం.డి గారు తన బంగళామీదనే లక్షరూపాయలు ఖర్చుపెట్టివుంటాడని ఒకరైతు అన్నాడు; ఆ లెక్కపక్కలు బయటవారు తెలిసికొనే అవకాశం ఎక్కడదనుకోండి; రైతులప్రశ్న ఈ సంవత్సరం ఫ్యాక్టరీకి మంచి లాభాలొచ్చాయి. అటువంటప్పుడు ఫ్యాక్టరీకి రోడ్లు వగైరాలభివృద్ధిమీద, రైతులకు ప్రోత్సాహక సహాయాలమీద కొంత ఎందుకు వెచ్చించకూడదు అని వాదుగుతున్నారు. బంగళాలు, వాహనాలమీద ఖర్చు ఆరోపణలవిషయం ఎట్లున్నా; రైతులడుగుతున్న తెందవప్రశ్న సమంజసమైనదికదా?

అరుణకుమార్‌గారికి ఒక సలహా-మీరు సమర్థులుకావచ్చు; పలుకుబడి గలిగినవారు కావచ్చు; ఇంకేమైనాకూడా కావచ్చు కాని ఒక సత్యాన్ని మీరు గమనించాలి; మీరు అధిపత్యం వహిస్తున్నది గవర్నమెంటు ఫ్యాక్టరీకాదు; వందలాదిరైతుల భాగస్వామ్యం గలిగిన సహకార చక్కెరఫ్యాక్టరీ. మీరు తీసుకుంటున్న జీతం, మీరనభవిస్తున్న సౌకర్యాలు మీ స్వంతంకావు, ప్రభుత్వానివీకాదు; చెరకురైతుల కష్టార్జితం సొమ్మని గమనించడం అవసరం. ఈ వాస్తవాన్ని మీరు గుర్తించగలిగితే రైతులను మీరు చులకనగా చూడరు; వారిని నిర్లక్ష్యంగా మాట్లాడరు. నెల్లూరు భీమడోలుకాదు. అసలు అటువంటిమాటే ఒక అధికారి నోటివెంట రాకూడదు. అరుణకుమార్‌గారు రైతులను, రైతు సమస్యలను అవగాహన చేసుకొని, వారితో స్నేహసౌహార్దాంతో మెలిగితే బాగుంటుంది.

○ ○ ○

9 తేది టవున్‌హాలులో శ్రీ కొండా గోపాలరెడ్డి అధ్యక్షతన జరిగిన చెరకు రైతుల సమావేశంలో శ్రీ మాదాల

-మిగతా 11వ పేజీలో

# టవున్‌హాలు అసలు పేరు

అసలు పేరు మరుగునపడి, అసలు దాన విస్మరింపబడి, మారుపేరు ఎట్లా స్థిరపడిపోతుందో ఏడుపదుల వయసు నిండిన ఎల్. పి హాలే నిదర్శనం!

ఈనాడు ఎల్ పి హాల్ అంటే ఎవరికి తెలియదు; టవున్‌హాలు అంటేనే పౌరులలో అత్యధిక సంఖ్యాకులకు పరిచయం. లేదా రేబాల లక్ష్మీనరసారెడ్డి పురమందిరం అనైనా అనాలి. ఇట్లా ఎందుకు జరిగింది? ఎవరుచేశారు? నకు తెలిసి దీన్ని ఎల్. పి. హాల్ అనే వారు తలో వు దేది; ఆహ్వానాల్లో, కరపత్రాల్లో ఎల్. పి హాల్ అనే ముద్రించేవారు; ప్రస్తుతం వున్న పోర్టికోకు ముందు L. P. Hall, Nellore అని వల్లని అక్షరాలు చెక్కబడివుండేవి; ఇప్పుడవి అదృశ్యమైనా యనుకోండి; ఎల్. పి. హాలు అని కాకుంటే, కొందరు టవున్ హాల్ అని వ్రాసేవారు. అంతేకాని శ్రీ లక్ష్మీనరసారెడ్డి పురమందిరం అని కాని, రావుబహదూర్ లక్ష్మీనరసారెడ్డి పురమందిరం అనికాని వాడేవారు కానే కాదు. ఇప్పుడు లేటెస్టుగా కొత్తగామరొక పేరుకూడా సృష్టింపబడి మొన్నొక ఆహ్వానపత్రికలోఅచ్చయింది- అరెడ్డి పురమందిరమట!

టవున్‌హాలు కట్టించింది ఆ తరానికి చెందిన రేబాల లక్ష్మీనరసారెడ్డి; ఆయనకు రావుబహదూర్ అనే బిరుదు వుండేది కాని, టవున్‌హాలుకు సంబంధించి ఆ బిరుదు ఎక్కడా కనపడదు; టవున్‌లో అమెరికన్ హాస్పిటల్ కొట్లనంటి చోట్ల మాత్రం ఫలకాలమీద రావుబహదూర్ రేబాల లక్ష్మీనరసారెడ్డి పేరు దర్శనమిస్తుంది. 1915 ఏప్రెల్ 9 తేది శంకుస్థాపనం శ్రీ పి యస్. శివస్వామి

సింహపురి

అయ్యర్ చేత టవున్‌హాలు ప్రవేశోత్సవం జరుపబడిన కాంశ్య ఫలకం మీద కూడా శ్రీ రేబాల లక్ష్మీనరసారెడ్డి అని వుందేకాని, రావుబహదూర్ అని లేదు. అసలీకి అబిరుదు వచ్చిందో లేదో తెలియదు. బిరుదు లేకపోవటం కాదు, THIS PUBLIC HALL అని తర్వాత తైనులో మిస్టర్ రేబాల లక్ష్మీనరసారెడ్డి అనివుంది కాని, రేబాల లక్ష్మీనరసారెడ్డి పబ్లిక్‌హాల్ అనికూడాలేదు.

ఈతరంవారికి అమధ్య దివంగతుడైన ఆర్. ఎల్. రెడ్డిగారే తెలుసు. ఆయనపేరు; ఈయనపేరు లక్ష్మీనరసారెడ్డే కాబట్టి టవున్‌హాలు ఈ లక్ష్మీనరసారెడ్డిగారు కట్టించిందేనని ఈతరంవారు అనుకోవటంకూడా జరుగుతున్నది. పూర్తగనేఅనుకోవడంకాదు. అవిధమైనభ్రమ కల్పించబడిందేమోననిపిస్తుంది. టవున్‌హాలు పూర్వంఎట్లావుండేదనుకున్నారు?

-మిగతా 10వ పేజీలో

## జిల్లా మార్కెటింగ్ సొసైటీ మహిమ!

# రెండేళ్ల నాటి బోనస్ ఈనాటికీ రైతులకు ఎందుకు చెల్లించరు?

అవినీతి పెరిగి యమధర్మరాజువనే ముఖ్యమంత్రి రామారావుగారి రాజ్యంలో 'స్వాహా'ల పర్వంగా, స్వేచ్ఛగా, నిర్భయంగా, బరితెగించిన విధంగా జరిగిపోతున్నాయి. అవినీతి నిర్మూలన, పరిశుద్ధ పరిపాలన టూ పట్టించి వారికి బహుమతుల ఆశచూపిస్తూ వ్యతిరేక ప్రకటనలను ప్రజల దృష్టిని మళ్ళిస్తున్నాడు మహానటుడు ముఖ్యమంత్రి రామారావు. ప్రజల మూర్ఖత్వాన్ని ఆధారం చేసుకొని, వారిని వట్టిగా మోసం చేస్తున్నారు; తనవల్ల నిర్వాకంపుంచి అధికారం అప్పగిస్తే, క్షేత్రస్థాయి మాటలతో ప్రకటనల ప్రగల్భాలతో ఆ సామాన్య ప్రజలనే వంచిస్తున్నారు.

తెలుగుదేశం ప్రభుత్వం వచ్చిన తర్వాత అధికారవర్గాలలో లంచగొండితనం తగ్గలేదని, రాజకీయ స్థాయిలో మాత్రం తగ్గిపోయిందని అనుకొనేవారు, రాజకీయ వర్గాలలో అవినీతిని నిర్మూలించగలిగామని రామారావును అభివందించేవారు కూడా, నాలుగు రోజులు గడిచే సరికి అధికార్లలో అవినీతి విచ్చలవిడి కావడమే కాదు; రాజకీయవాదులలో కూడా ఎక్కువైపోయింది. అందులో పదవుల్లో ఉన్న తెలుగుదేశీయులే పరమ లంచగొండులు కావడం నిత్యానుభవంగా ఉంది. తెలుగుదేశం అనుభవజ్ఞులలో లంచగొండితనమే కాదు, తాము, తమ పదవులను అపవిత్రం చేసుకునే పెద్ద

### జిల్లా వార్తలు

మనుషులు ఉన్నారు. వీరిని గుర్తించాలి; వ్రాస్తే వ్యక్తిగతంగా నిష్ఠూరాలకు వ్యతిరేకతలకు గురికావాలి, వ్రాయకుండా వదిలేద్దామంటే పత్రికా ధర్మాన్ని విస్మరించిన వారమవుతాము, ఏమైనా ఇటువంటి అధికారులను, అవధి కాలంలో ప్రజలకు పరిచయం చేయాలి; వారి వ్యవహారాన్ని బట్టబయలు గావించాలి ఆ విషయాన్ని ప్రస్తుతానికి వదిలేద్దాం!

o o o

రైతులను ఆదుకోడానికి ధ్యేయం వ్యాపారం ప్రారంభించిన కోఆపరేటివ్ మార్కెటింగ్ సొసైటీ ఆ రైతులకు ఎంత వరకు న్యాయంగా చేయవలసిన సహాయం చేయగలిగింది అని ప్రశ్నించుకుంటే చేయలేకపోయింది అని చెప్పితీరాలి. ఆనాడు ధాన్యం కొనుగోలులో, పర్మిట్ల వినియోగంలో కుంభకోణాలు జరిగినట్లు అప్పుడు తీవ్రమైన ఆరోపణలొచ్చాయి. అధ్యక్షులు శ్రీ ... రామనారాయణరెడ్డి పత్రికలవారికి రాజమండ్రివంటి తన అధికార కార్యాలయంలో చల్లని పదార్థాలతో విందుచేసి, ఆ ఆరోపణలన్నీ అబద్ధం, నిరాధారం అంటూ లెక్క పత్రాల జెరాక్స్ కాపీలు అందించి ఉండేవారు. పెద్దమనిషి చెప్పారు కాబట్టి పత్రికలవాళ్ళు ఆరోపణలు ఆధారం లేనివేనంటున్నారు. మార్కెటింగ్ సొసైటీ అంటే ధాన్యం వగైరా తినేపదార్థాలున్న వ్యాపారసంస్థ, మన ఇళ్ళలోనే ఎలుకలు, పందికొక్కులు పుష్కలంగా ఉంటున్నాయి! ఇక మార్కెటింగ్ సొసైటీ వంటి భారీ వ్యాపారసంస్థలో ఇంకెంత పెద్ద పెద్ద పందికొక్కులుంటాయో ఏమి చెప్పగలము!

అది పోనీండి. 1983 లో కోవూరు తాలూకాలోని కొన్ని గ్రామాలలో వ్యాపారస్తులు కొనడానికి నిరాకరించిన మొలగొలుకు ధాన్యాన్ని ఏదో ఒక ధరకు మార్కెటింగు సొసైటీ కొన్నది; నిజంగా రైతులకు పెద్ద సహాయం. మరచిపోలేని సహాయం ఇది. ఆ ధాన్యాన్ని పుట్టి రూ 1100 ల వంతున తిరిగి కొన్నారట. దానిమీద సొసైటీకి లాభం వచ్చింది. సహకారసంస్థ కాబట్టి ఆ లాభాన్ని తాము తినకుండా, అందులో కొంత భాగాన్ని రైతులకు పంచిపెట్టదలచుకున్నారట; పుట్టి రూ 1180 లకంటే తక్కువ ధరకు కొన్న రైతులకు క్వింటాల్‌కు పదిరూపాయల వంతున బోనస్ ఇవ్వదలచుకున్నారట! అంటే పుట్టికి రూ 85. ఈ బోనస్‌కు మొత్తం 115 మంది రైతులు అర్హులని తేల్చారు; వారికి చెల్లించాల్సిన బోనస్ మొత్తం సుమారు లక్షరూపాయలని తెలిసింది. ఎవరెవరికి ఎంత బోనస్ లభించేది ఆయా రైతులకు దాదాపు సంవత్సరం క్రితమే వ్రాతపూర్వకంగా తెలియజేశారు. ఆ తరగి

—కొనవ 6వ పేజీలో

## నెల్లూరు ముచ్చట్లు
విమర్శకుడు

### పెనుగాలి

పూర్వం నవంబరు నెల్లూరు జిల్లాకు తుపాను నెల క్రింద లెక్క. అటువంటిది ఇటీవలి సంవత్సరాలలో మే నెల కూడా అలా అవుతుందా అనిపిస్తున్నది.

ఎక్కడో కళింగపట్నం వద్ద దూరంగా బంగాళాఖాతంలో వాయుగుండం ఏర్పడి అది తుపానై వాయవ్యంగా పయనిస్తుందని. దాని ప్రభావంవల్ల శ్రీకాకుళం మొదలు ఉభయ గోదావరులవరకు పరిసరాల్లో వర్షాలుండవచ్చునని చెప్పారు. ఆ వాయుగుండం ఏమైందో తెలియదు కాని, 28 తేది సాయంత్రం మొదలు రాత్రివరకు నెల్లూరు పట్నం, చుట్టుపక్కల పల్లెల్లో భయంకర పెనుగాలి వీచింది; మిద్దెలతో సహా లేచిపోతాయేమోనన్నంత తీవ్రంగా వీచింది ఆ గాలి. సాయంత్రం 6 గంటలప్పుడు టన్నేలారోడ్లమీద లేచిన దుమ్ములో వాహనాలు లైట్లు వేసుకొని నడవవలసివచ్చింది; రిక్షా కొన్ని ప్రయాణికులతోటి పల్టీ కొట్టాయి. పల్లెల్లో పూరికొంపల స్థితి దీనత్వమనుకోండి. గాలితోటి కొద్దిపాటి వర్షంకూడా! అదే టన్నేలలో వున్నంత వర్షం పల్లెల్లో లేదు.

### మంత్రి శ్రీనివాసులురెడ్డి

మంత్రులు తమ హెడ్ క్వార్టర్సు హైదరాబాదు నుండి తమతమ జిల్లాలకు మార్చుకోవడం, వారికి అనుకూలమేమో ననిపిస్తుంది. రాకపోకలు ఎంత శ్రమ తప్పు- కాలము ఎంత వేస్టు!

రెవిన్యూ మంత్రి శ్రీ శ్రీనివాసులు రెడ్డి ఈ వారంలో తప్పుకోనువిపోయారు, తెలుసుగదా! మళ్ళీ జూన్ 5 తేది వచ్చి 9 తేది వరకు జిల్లాలో పర్యటించబోతున్నారు.

5 తేది ఉదయం సూళ్లూరుపేటలో దిగి, సమితిలో పర్యటించి, రాత్రి నాయుడుపేటలో బస; 6 తేది నాయుడుపేట సమితి పర్యటనం. రాత్రి గూడూరు మకాం; 7 తేది గూడూరు సమితి పర్యటన, నైట్ హాల్ట్ గూడూరు; 8 తేది ఉ 9 గం. సైదాపురం బ్రిడ్జి ప్రారంభోత్సవం. 10 గంటలకు బాలాయపల్లె సబ్ స్టేషన్ ఓపెనింగ్ 1 గంటకు వెంకటగిరి మంచినీటి పథకం ప్రారంభం, 12 నుండి 6 వరకు ఎం. ఎల్. ఎ - సమితి అధ్యక్షుల కార్యక్రమాలు రాత్రి నెల్లూరు మకాం, 9 తేది కోవూరు సమితి, రాత్రి 7-12 కు నెల్లూరు హైదరాబాదుకు రైలెక్కుతారు.

### మండలాలు

జిల్లాలో 46 మండలాల అవసరమైన ఏర్పాట్లన్నీ పూర్తి అయ్యాయి! అధికార్ల, ఉద్యోగుల నియామకం జరిగిపోయింది. గజెట్ ఇచ్చు కూడా ఈరోజు సాయంత్రానికి పూర్తి అవుతుందట. మండలాల ప్రారంభోత్సవం 28 తేదిన వుంటుందనే వుద్దేశ్యంతో అధికార్లు హడావిడిగా ఏర్పాట్లు చేస్తున్నారు. ఎందువల్లనో ప్రభుత్వం నుంచి ఈ క్షణం వరకు తేదీ రాలేదు.

మండలాలలో వర్గబాట్లు, మార్పులు ఏమైనావున్నా, యేమో తెలియదు. కొన్ని మార్పులు వుండవచ్చునేమోననే అనుమానం కలుగుతున్నది; ఆధారమున్న అనుమానం కాదిది. కొందరు కోర్టుకు పోవచ్చుననే పుకారుకూడావుంది. తేది ఆఖరు నిమిషంవరకు ప్రకటించకుండడం కోర్టుకుపోయే అవకాశం లేకుండాచేయడానికే నంటున్నారు.

మొత్తానికి పరిపాలనా వ్యవస్థను అస్తవ్యస్తంచేసి, అశాంతి అలజడి కల్గించనిదే ముఖ్యమంత్రి రామారావుకు నిద్రపట్టేట్టులేదు.

### భవనాలశాఖలో భేతాళుడు!

మంత్రినే బురిడీ కొట్టించగలిగిన అధికారి ఎంత ఘటనాఘటన సమర్థుడుగా వుంటాడో వూహించండి! నెల్లూరు రోడ్లు భవనాలశాఖ అదృష్టమో ప్రత్యేకతో అటువంటి ఘనుడొకడున్నాడంటున్నారు.

ఇంజనీర్లు తినడానికి ఎన్నోఎన్నో తహదార్లు వుంటాయి; అవేమతో

—[illegible] పేజీలో

అవిశ్వాస, రద్దుల సందిగ్ధంలో గూడూరు కౌన్సిల్

# మస్తానయ్య ఒక్కడేకౌన్సిలరు:- తక్కినవారంతా ఛైర్మన్లు!

తనమైనా వుండాలి. లేదా బలమైనా వుండాలి. రెండూ వుంటే చాలమంచిది. వీటివల్ల కీ॥శే॥ పసుపులేటి సిద్ధయ్య నాయుడు; కీ॥శే॥ పొన్నలూరు కోటారెడ్డి ఛైర్మెన్లుగా చక్కగా రాణించారు. పై రెండింటిలో ఒకటి లేనివారికి ఛైర్మెన్ పదవి, బట్టనెత్తివానికి బంగారు దువ్వెన బహూకరించినట్లుంటుంది. మాజీ మంత్రి శ్రీ [illegible] పుణ్యాన ఈ మున్సిపాలిటీ ఛైర్మెన్ పదవి రిజర్వుడుగా మారింది. కాంగ్రెసు అభ్యర్థి శ్రీ పి. మస్తానయ్యను వరించింది.

శ్రీ మస్తానయ్య మంచివాడే. అయితే ఛైర్మెన్ "లెవెల్" మినహా ఏ శక్తి లేనివాడైనందున తన స్వంతపార్టీవారే ఆతనిమీద అధారపడ్డారు. ఈయనమీద 1984 ఆగస్టులో అవిశ్వాస తీర్మానం నెగ్గింది. కాని పాలనలో జి. ఒ. తో వచ్చిన మార్పులవల్ల ఆ తీర్మానం వీగిపోయింది. రూలుప్రకారం ఒక సంవత్సరంలోగా తీర్మానం తీసుకురావడానికి వీలులేదు. రేపు ఆగస్టుకో అలాంటి వీలు ఏర్పడుతుందని, తన పదవికి ముప్పు వస్తుందని శ్రీ మస్తానయ్య సందేహం. ఆయన భయానికి కారణం తన పార్టీ బలం 10 లోపే వుండడం, తెలుగుదేశం బలం 15 కు (వారికి మద్దతు ఇచ్చే బి జె. పి. కమ్యూనిస్టులతోసహా) పెరగడమే కారణం!

అయితేగియితే, తెలుగుదేశంలో ఎవరు ఛైర్మెన్ కావాలనే సమస్య ఉత్పన్నమైంది. వారిలో శ్రీ కె. ఉదయకుమార్, శ్రీ నక్కా పెంచలయ్య ఇంకా కొంతమంది వున్నట్లుంది. మొదటి ఇద్దరూ ఇటీవలి ఛైర్మెన్ మస్తానయ్య ఒక కాంట్రాక్టు విషయంలో వంచించారని అభియోగం తెచ్చారట. ఈ కాంట్రాక్టు ఎస్టిమేటు మొదట కొంతవేలా ఐదువంతలుగా వుండినదని; దానిని ఒక లక్ష పంతైవేలగా తర్వాత మార్చారని టీవిలో కుంభకోణం వుందని వారి అభియోగం.

గాంధీబొమ్మనుండి బస్టాండు వరకు వున్న రోడ్డుకు మొదట అనుకొన్న ప్రకారం కాక, మున్సిపల్ కౌన్సిలర్ల కోరికమీద మార్పులు వచ్చిందని, ఈ మార్పులవల్ల ఎస్టిమేటు మొత్తం పైవిధముగా పెరిగిందని, ఎప్పటికప్పుడు సాంకేతిక సిబ్బంది పబ్లిక్ హెల్త్ వారు పై మార్పులకు అంగీకారం తెలిపి పెరిగిన మొత్తానికి మంజూరు తెలిపారని చెప్తున్నారు.

రఘురామయ్య, ఉదయకుమార్ ఈ విషయంలో నేరాలు ఆఫీసుపనుల్లో అడ్డంకం కలిగిస్తున్నారని ఆఫీసు అంటూంది. ఈ విషయంలో తెలుగుదేశంనాయకులు శ్రీ మాగుంట రంగారెడ్డి, శ్రీ గౌస్ మొహిద్దీన్ వాళ్ళని కాంటువాల్సి ప్రయత్నం చేసి విఫలులయ్యారని అంటున్నారు.

ఈ గందరగోళం ఎందుకు; కౌన్సిల్నే సూపర్సీడ్ చేసెయ్యమని విపాలనచేస్తామని కొందరు కౌన్సిలర్లు అంటున్నారు.

పదవీకాలం ఎటూ అయిపోతోంది గదా, ప్రస్తుత కౌన్సిల్ యధాతథంగా వుంచితే బాగుంటుందని టి డి పి, సీనియర్ సభ్యులు ఒకరంటారు.

ఇక ఛైర్మెన్ పదవిని కాపాడుకోడానికి తెలుగుదేశంవాళ్ళు పనులే చేసిపెడుతున్నారని కాంగ్రెస్ కౌన్సిలర్లు బాగా అనుమానపడుతున్నారు. ఏదిఏమైనా దీనికి ఒక విచిత్రమైన స్వరూపం రావటానికి ఆస్కారం వుండవచ్చు. ఈలోగా ఎన్నో మార్పులు రావచ్చు. సూపర్సీడ్ చేయడం అంత తేలికగాదు.

నిజం చెప్పాలంటే ఈ కౌన్సిల్లో శ్రీ మస్తానయ్య ఒక్కడే కౌన్సిలర్, మిగిలిన వాళ్ళంతా నిజమైన ఛైర్మెన్లు.

### కమీషనర్ బదిలీ?

మున్సిపల్ కమీషనర్ ఏక్షణానైనా బదిలీ కావచ్చు. వారిస్థానే శ్రీ లక్ష్మీనరసయ్యగారి, ఇక్కడ మును పనిచేసిన శ్రీ అప్పారావుగారి రావచ్చునని తెలుస్తూంది. — —





గ్రామపంచాయతీ కార్యాలయం ఎల్లాయపాళెం

## టెండరు ప్రకటన

Roc. No : 124/85 18-5-85 తేది.

నెల్లూరుజిల్లా, కోవూరుతాలూకా, ఎల్లాయపాళెం గ్రామపంచాయతీకి 1985-86 సంవత్సరమునకు దఫాలవారిగా క్రింది వస్తువుల సరఫరాకుగాను మరియు పంచాయతీ కార్యాలయము రిపేర్ల నిమిత్తము సీల్డు టెండర్లు కోరబడినవి. 1-6-85 తేది మధ్యాహ్నము 2 గంటలకు పంచాయతీ కార్యాలయమున కార్యనిర్వాహణాధికారిచేగాని, వారి అనుమతిపొందినవారిచేగాని టెండర్లు స్వీకరించబడి అదేరోజు సాయంత్రం 4 గంటలకు టెండర్లు తెరువబడును టెండరుదార్లు ధరావతు చెల్లించి రశీదులు జతపరచవలయును ఇతర వివరములు ఆఫీసు పనిచేయు వేళలలో తెలిసికొనవచ్చును.

| వ. నెం. | వివరము | ధరావత్తు |
|---|---|---|
| (1) | వీధి విద్యుద్దీపముల సామగ్రి సప్లయి | రూ. 100-00 |
| (2) | 1x40 సింగిల్ 4' ట్యూబులైటు ఫిక్చరు: 3/20 వైరు ఫిక్సింగ్ మెటీరియల్స్‌తోసహా (ఫిలిప్స్, మైసూరు కంపెనీల అతరైజ్డ్ డీలర్లుమాత్రమే) | రూ. 100-00 |
| (3) | బోర్ వెల్, పి. వి. సి. వాటర్ సప్లయి అడిషనల్స్ సప్లయిచేయుట | రూ. 100-00 |
| (4) | పారిశుధ్య సిబ్బందికి యూనిఫారములు పాదరక్షలు సప్లయిచేయుట | రూ. 50-00 |
| (5) | స్టేషనరి, ప్రజారోగ్య వస్తువుల సప్లయి | రూ. 50-00 |
| (6) | పంచాయతీలో బోర్ వెల్స్ రిపేరి చేయుట మరియు మోటారు, స్టార్టరు రిపేరు చేయుట | రూ. 25-00 |
| (7) | పంచాయతీ కార్యాలయము రిపేర్లు (రీ టెండరు) ఎస్టిమేటు విలువ రూ 6,160 లు | 2 1/2 ./. |

–ఎస్. చంద్రశేఖరం కార్యనిర్వాహక అధికారి

# జిల్లావార్తలు

(5వ పేజీ తరువాయి)

కాలు చేతబట్టుకొని ఆ రైతులు ఇంత కాలంనుండి కాళ్ళు అరిగేటట్లు మార్కెటింగ్ సొసైటీచుట్టూ తిరిగారు. జవాబు చెప్పిన నాథుడుకూడాలేడు; చివరకు ఆశ మానుకొనే స్థితిలో ఉన్నారు.

దానిసంగతి మొన్న కొత్త విషయం బయటపడింది; బోనస్ డబ్బులిస్తున్నారని తెలిసి టవున్‌లో వున్న రైతులు ఇద్దరు పోతే, వారికేదో ముట్టజెప్పారట. అందులో కూడా ఒక కుంభకోణం. అతన్ని అంత టితో వదిలేశారు కాబట్టి ఆ ప్రస్తావన మానేస్తాం. 115 మంది రైతుల్లో ఇద్దరికిచ్చారు; తక్కిన 113 మందికి ఇవ్వలేదు; ఆ సీజనులో వచ్చితీసుకపొమ్మని తెల్పనుకూడాలేదు. అట్లా తెల్పకుండ దానికి కారణమేమిటి? తెల్పాల్సిన బాధ్యత వారికిలేదా? అసలు ఇంతకాలం ఎందుకు చెల్లించలేదు? దీనివిషయమై మేము సొసైటీ అధికారినొకరినడిగితే అబ్బే మేమింతా ఎవ్వరికి చెల్లించలేదన్నారు; అసలు ఇడిచే కాలేదని బుకాయించారు; నిలదీసి అడిగితే అసలుసంగతి బయటకువచ్చింది. ఆ అధికారి చెప్పిందంతా పచ్చిఅబద్ధమని తేలింది. ఆయన ఆ విధంగా అబద్ధం చెప్పడంలోని ఆంతర్యమేమిటో ఈవిలేఖరికి ఇప్పటికీ అర్థం కావటంలేదు.

అసలు 1984 మార్చిలోనో ఫిబ్రవరిలోనో ముఖ్యమంత్రి శ్రీమాన్ నందమూరి తారక రామారావుగారిని పిలిపించి, ఆయన అమృతహస్తాలమీదుగా రైతులకు ఈ బోనస్ ను అందజేయించి ఆయన అభిమాన ఆశీర్వాదాలను చూరగొనాలని ఒకపథకం వేశారట. మనుషులు పాతైనా అసభ సమావేశమన తలదన్నేలా తీర్చిదిద్దాలని కాబోలు సరికొత్త ప్లాస్టిక్ కుర్చీలు కొనుగోలు చేశారట. ఎన్నికొన్నారో, ఎక్కడకొన్నారో, ఎవరు కొన్నారో, ఏ లెక్కన కొన్నారో తెలియదు. అప్పుడు ఆ ముఖ్యమంత్రిగారి ఆ కార్యక్రమం ఆగిపోయింది. అనాటినుంచి రైతులకు ఆ బోనస్ చెల్లించడమూ ఆగిపోయింది. బోనస్ చెల్లింపు ఎందుకు ఆగినట్టు, అంటే సంతృప్తికరమైన సమాధానం రావడంలేదు. ఒక్క అధికారి అస్వస్థుడైతే అంతపెద్ద సంస్థలో ప్రతిష్టంభన ఏర్పడవలెనా? ఏర్పడుతుందా? అసలు ముఖ్యమంత్రి కార్యక్రమం రద్దయిన తర్వాత రైతులకు తెలిపి వెంటనే డబ్బు ఎందుకు చెల్లించి వుండకూడదు? అధ్యక్షుడైన శ్రీ ఆనం రామనారాయణ రెడ్డిగారు ఏమిచేస్తున్నట్లు?

ఇప్పటికైనా తక్కిన 113 రైతులకు తెల్పి వెంటనే వారివారి బోనస్ డబ్బులు వారికి చెల్లించడం ధర్మం. అదేగాక తక్కువ ధరకు కొన్ని ప్లాస్టిక్ కుర్చీలను రెండింతల ధరకు బలవంతంగా ఖాతాదార్లకు అంటగట్టాలనే ప్రయత్నం వున్నట్టుంది. ఆ ప్రయత్నాన్ని కూడా సొసైటీ అధికార్లు విరమించుకోవాలి.

### కావలికబుర్లు

మంచినీటి కటకటతో కావుకంచేయదం కావలి పౌరులకు అనాదిగా అలవాటే నవుకొంది, ఈ సంవత్సరం ఆ సమస్య మరీ తీవ్రంగా వుంది. అందువల్లనే ఈ సమస్యనుగూర్చి చర్చించడానికో, ఎం. ఎల్.ఏ. గా కొత్తగా ఎన్నికైన శ్రీ యానాదిరెడ్డి 'ఓత్' స్వీకరణకో మొన్న మునిసిపల్ కౌన్సిల్ సమావేశం ఏర్పాటు చేయబడింది. యానాదిరెడ్డి మంచినీటి సౌకర్యానికి ప్రభుత్వం ఇచ్చిన వాలుగు లక్షలు సద్వినియోగం కావాలన్నారు. రాజకీయ పార్టీలు పక్షరహితంగా ఈ సమస్యతో యుద్ధం చేయాలన్నారు.

70 వేల జనాభాగం కావలిటవున్‌కు 14 లక్షల గ్యాలన్లనీరు కావలసివుండగా ప్రస్తుతం నాలుగున్నర లక్షల గ్యాలన్లుమాత్రమే లభ్యమవుతున్నాయని డిప్యూటీ ఎగ్జిక్యూటివ్ ఇంజనీరు శ్రీ రామచంద్రారెడ్డి చెప్పారు. వీటికొరత ఎంతభయంకరమో దీన్నిబట్టే తెలుస్తుంది. టవున్‌లో 200 కొళాయిలుంటే అందులో 125 మాత్రం పనిచేస్తున్నాయని చైర్మన్ శ్రీ ఉదయ భాస్కర్ వెల్లడించారు.

యానాదిరెడ్డిగారు ప్రతిపక్ష కౌన్సిలర్ల వార్డులమీద కేంద్రీకరిస్తారట. ప్రధాని రాజీవ్ ను మార్గదర్శకంగా తీసుకొని కాబోలు!

o o o

ఆటోమేటిక్ టెలిఫోన్ ఎక్ఛేంజి భవనానికి జనరల్ మేనేజర్ శ్రీ డి.. ఆర్. నందా 22 తేది ప్రారంభోత్సవం జరిపారు. అతి విరాడంబరంగా జరిగిన ఈ కార్యక్రమంలో డి.డి.ఎం. గోవర్థన్, డైరెక్టరు మోహనమూర్తి ప్రభృతులు పాల్గొన్నారు. భవనాన్ని తక్కువకాలంలో నిర్మించిన ఇంజనీర్లు శ్రీ టి కృష్ణమూర్తి వగైరాలను; భవనానికి అమరజీవి పొట్టి శ్రీరాములు పేరు సూచించిన మునిసిపల్ కౌన్సిలర్ శ్రీ ఎస్. ఎ. జార్జ్‌ని శ్రీ నందా అభినందించారు.

### పామూరు లియోక్లబ్

ప్రకాశంజిల్లా. పామూరులో కొత్తగా ఒక లియోక్లబ్ స్థాపించారు. దీనికి అధ్యక్షుడుగా శ్రీ బి. శ్రీనివాసులు, కార్యదర్శిగా శ్రీ పి. రమేష్, ఉపాధ్యక్షుడుగా శ్రీ ఎం. వి. కె. ఎస్. ప్రసాద్, కోశాధికారిగా శ్రీ ఎం. సుబ్బారావు ఎంపికైనారు.

### శ్రీహరికోట మేడే!

శ్రీహరికోట రాకెట్ కేంద్రం వద్ద మే 1 తేది కార్మిక దినోత్సవాన్ని ఘనంగా జరుపుకున్నారు, ఈ సందర్భంగా జరిగిన సభకు- ఉద్యోగుల సంఘం అధ్యక్షుడు శ్రీఎస్. సుభాష్‌చంద్రుడు అధ్యక్షించారు. సిపిఐ నాయకుడు కాకరాణి నెల్లూరు రామచంద్రారెడ్డి అప్పటి డాక్టర్ విజయకుమార్ తదితరులు మాట్లాడారు. సూళ్ళూరుపేట ప్రజానాట్యమండలికి చెందిన కుమారి విజయ నృత్యప్రదర్శన చేశారు.

(10వ పేజీలో మరికొన్ని)

## In the Court of the Addl. Subordinate Judge, Chittoor

O E P No 58/83 O S No 90/70

Between : M Chengaiah Naidu -DHr,

And A B Kumararwamy Naidu –JDr,

AUCTION NOTICE

The below mentioned immovable properties of the above J Dr will be sold in public auction in the premises of the above Court from 11 A M onwards on 24-6-85 The intending bidders can participate in the said auction

SCHEDULE :

Chittoor District-Chittoor Sub-District lands situate in Ellapalle village within the following particulars belonging to Sri A B Kumaraswami Naidu, Judgment debtor

| S No | Survey No | Dry/ Wet | Extent Ac Cts | D Hr value | Amin's value |
|---|---|---|---|---|---|
| 1) | 3-12 | Dry | 0-43 | 300-00 | 3610-00 |
| 2) | 4- 3 | ,, | 2.66 | 1750-00 | 18620-00 |
| 3) | 5- 8 | ,, | 0-74 | 750-00 | 5180-00 |
| 4) | 13-7 | ,, | 0-62 | 700-00 | 4340-00 |
| 5) | 16-7 | ,, | 0-54 | 550-00 | 3780-00 |
| 6) | 18-3 | ,, | 0-33 | 750-00 | 5810-00 |
| 7) | 18-7 | ,, | 0-44 | 400-00 | 3850-00 |
| 8) | 79-6 | ,, | 0-10 | 150-00 | 700-00 |
| 9) | 43-1 | ,, | 0-33 | 350-00 | 2310-00 |
| 10) | 48-17 | ,, | 0-07 | 100-00 | 490-00 |
| 11) | 79 | ,, | 0-19 | 225-00 | 1330-00 |
| 12) | 45- 9 | ,, | 0-98 | 650-00 | 4900-00 |
| 13) | 43- 5 | ,, | 1-13 | 750-00 | 7910-00 |
| 14) | 45- 3 | ,, | 0-40 | 650-00 | 6860-00 |
| 15) | 23- 2 | Wet | 0-80 | 1500-00 | 7200-00 |
| 16) | 24- 3 | ,, | 0-14 | 250-00 | 1260-00 |
| 17) | 26- 2 | ,, | 0-52 | 850-00 | 4680-00 |
| 18) | 28- 8 | ,, | 0-25 | 500-00 | 1260-00 |
| 19) | 49-11 | ,, | 0-71 | 1500-00 | 6390-00 |
| 20) | 50-14 | ,, | 0-35 | 350-00 | 3150-00 |
| 21) | 52-10 | ,, | 0-10 | 225-00 | [illegible] |

Encumbrances Nil

T BALAKRISHNA REDDI
Advocate for Decree Holder
Chittoor

శ్రీమతే నారాయణాయ నమః
శ్రీమతే రామానుజాయ నమః



## శ్రీమదష్టాక్షరీ మంత్రరాజ మహాక్రతువు

లక్ష్మీనారాయణా నిత్యదంపతీ జగదాంపతీ।
దర్శ్యాస్తాం ఆయురారోగ్య ఐశ్వర్యం సంతతిం చిరం॥

స్వస్తి. శ్రీ క్రోధననామ సంవత్సర ...ష్ఠ శుద్ధ త్రయోదశి స్థిరవారమునకు ...య్యు తేది 1-6-1985 దినము నుండి ...ష్ఠ బహుళ సప్తమీ శుక్రవారమునకు ...డుగు తేది 7-6-1985 వరకు లోక ...ర్థమై నెల్లూరు శ్రీరంగరాజపుర ...న (ఉస్మాన్‌సాహెబ్ పేట) వేంచేసి ...డు శ్రీ కోదండరామస్వామి వారి ...న్నిధియందు పంచాహ్నిక దీక్షతో ...మదష్టాక్షరీ మంత్రరాజ మహాక్రతువు ...హింప భగవదా దేశముపాతము ...ల్పింపబడినది. కావున ఆస్తికమహా ...లెల్లరు ఈ పవిత్ర మహాక్రతువునందు ...సి శ్రీలక్ష్మీనారాయణుల దివ్యాను ...హమునకు పాత్రులై కావలసినదిగ ...ర్థన. ఇందు ప్రతినిత్యము శ్రీమంత్ర ...జప హోమ తర్పణాదులు వేద ...వ్యప్రబంధ శ్రీరామాయణ శ్రీపురాణ ...ం. శ్రీమద్భాగవత శ్రీభగవద్గీతాస్తోత్ర ...న్నాది పారాయణములు శ్రీవిష్ణుసహ ...స్ర సహస్రనామార్చనలు, పండితుల ...న్యాసములు, భజన సంకీర్తనలు ...రితరా కాలక్షేపాదులు. విశేష దినము ...లో కలశాభిషేక, కల్యాణోత్సవ ...తరామేష్టి యాగాదులు అన్నసంతర్పణము ...ను అన్నకూటోత్సవము జరుగును. ...వున భక్తులెల్లరు వ్యవహస్త వరహస్త ...ల ద్వారా యథోత్సాహము ధనము ...వంగి ఈ మహాక్రతువు నిర్వహణము ...కు సహకరింప ప్రార్థించుచున్నాము.

ఇట్లు
శ్రీ మదష్టాక్షరీ మంత్రరాజ
మహాక్రతువు
నిర్వహణ సంఘం
శ్రీరంగరాజపురము
(ఉస్మాన్‌సాహెబ్ పేట)
నెల్లూరు.



జమీన్‌రైతు చందా
...సంవత్సరం చందా రు. 40-00
...ర్థ సంవత్సరం రు. 20-00

# శివారెడ్డి పద్యాలు

### కౌన్సిల్ రద్దు

పదిలమెప్పుకోరవు ; ద్రావుపొరపి టు.
కౌన్సిల్లరద్దు కాగెను
రెండు మూడు మాసాలె ... రాజీవ!
పొలిటిక్సు వంటబట్టినట్లు!

చెప్పుడుమాటలు వింటే
తప్పవే తగవులు,
హితవు తలకెక్కదు మా
కిప్పుడు పీడె విడాకము
నవ్వులా ఆటగెయకు పాతవద్దతి తెన్డూ!

తెలుగుదేశమువకు తలనొప్పిమనమంటె,
ఎన్టి రామారావు కేవగింపు,
మూసుకోనికకు మోమాటమునకెళ్ళి
పాలుటొయకు బ్రాచుదాములకుమ!

ఎంతకాలమైందో ఏ నాడు బుట్టిందో
కౌన్సిలువారి కడుపుగొడితె
శాకిఘోషదప్ప రాజీవ మన
కొచ్చెదేంది దీంతో వాటిగెదేంది?

### పంజాబు

సాటిలేని యిండ్య సామ్రాజ్యమదియేడ,
పవికిమాల్న ముష్టి పంజాబేడ
కొందువ్వకేడ, కలిపిందజూసై
మంట్లోకలిపిపోద మాయమోద?

మెత్తగుంటె నెవరు మెదగత్తుకుంటారు
యానెగాడు ఎవ్వ దేంగూత
చెయ్యిగాలినాక చేసేదిలేదు నం
టాజు ముందుగానె జాగ్రతవడు,

### సుందరయ్య

పల్లెటూరికవిని పార్టీతొపనేడు
మచ్చలేనిమనిషి మన్నతునక
అయ్యో! సుందరయ్య పొయ్యా చెబుదాని
కాలమృత్యువుపడు కటకమైయ్యె!

### బస్సు ఛార్జీలు

దానగుందితక్కిరి బస్సుల్లో ఛార్జీలు
పెంచినారు కొంపమునిచినారు
నేను ప్రతిదినమ్ము నెల్లూరుకాబల్లి?
అదనపదప, తిన్నదరగబల్లి!

బనుబదేరిదెబులి బస్సుల్లో నాకుంచె
కుర్రకారు, ఏమికొంపమునిగె
నదిచినసై వినిమ వచ్చినావన్దంటు?
తిరిగిపొమ్మనంద్ర, తిక్కయువత?

# ఆస్తుల కొనుగోలు (మొదటిపేజికొరవ)

లించగా కోటి రూపాయలకు పైగావేసే భవనాన్ని అంతకు తక్కువకు వెలకట్టి రిజిస్ట్రేషన్ చేయడానికి సబ్‌రిజిస్ట్రార్ నిరాకరించగా ఆయనను బదిలీచేసి కొత్త రిజిస్ట్రార్‌ను నియమించి పని పూర్తిచేయించుకున్నారని తెలిసింది.

సాగర్ టాకీసు కొనుగోలుతో ముఖ్యమంత్రి ఆగిపోలేదు. నాంపల్లి రైల్వే స్టేషన్ ఎదురుగా వున్న రాయల్ హోటల్, రాయల్ లాడ్జింగ్ భవనాలను; అవక్కనే ఇటీవల కొత్తగా కట్టిన హర్ష హోటల్‌ను ముఖ్యమంత్రి కొన్నారని తెలిసింది. నాంపల్లిలోనే వివాదంలోవున్న లతా సినిమా థియేటర్‌ను కూడా ముఖ్యమంత్రి నేడోరేపో కొనబోతున్నట్లు తెలిసింది. గండిపేటలో తాను కట్టుకున్న ఆశ్రమం ప్రక్కనే సుమారు 10 ఎకరాల భూమిని చౌకలో కొని 30 గదులతో పార్టీ కార్యాలయాన్నికూడా ఆయన నిర్మిస్తున్నారు. పార్టీకార్యాలయాన్ని తన కొడుకుపేరిట ఆయన రిజిస్ట్రేషన్ చేయించారని తెలుస్తున్నది. టాంక్‌బండ్ ఎదురుగావున్న డి. బి. ఆర్. మిల్లులో ఖాళీగావున్న పాతిక ఎకరాల భూమిని కేవలం నామమాత్రపు రేటుకు కొనేందుకు ముఖ్యమంత్రి అన్నిప్రయత్నాలు పూర్తిచేశారని తెలిసింది. సుమారు 3 వేలమంది కార్మికులకు ఉపాధికల్పిస్తున్న ఈమిల్లు సుమారు ఒకసంవత్సరకాలం నుంచి మూతపడివుంది. అందువల్ల కార్మికులు తిన డానికిలేక నానాఇబ్బందులకుగురవుతున్నారు. బొంబాయికి చెందిన ఒక సంస్థ ఈ మిల్లును చౌకలో కొనేందుకు ఏర్పాట్లుచేసి ఆ మిల్లులో ఖాళీగావున్న భూమిని తాను కొనుగోలుచేసేందుకు ముఖ్యమంత్రి పథకం సిద్ధం చేశారని తెలిసింది. శాసనసభ ఎన్నికల ముందు ఆపద్ధర్మ ముఖ్యమంత్రిగా వుంటున్నప్పుడే ఆయన ఈ ప్రతిపాదనకు తుదిరూపం ఇచ్చారని, అయితే సంబంధించిన అధికారి ఈ ప్రతిపాదనను వ్యతిరేకించి ఇందువల్ల ముఖ్యమంత్రి చిక్కుల్లోపడే ప్రమాదముందని చెప్పారట. అయితే ఏచిక్కులు తనవేమీ చేయలేవని, అమ్మకం ప్రతిపాదనను ఖరారుచేయాలని ఆయన ఆదేశించారని తెలుస్తున్నది.

ఇకపోతే ఆబిడ్స్‌లో జనరల్ పోస్టాఫీసు ఎదురుగా వున్న వసంతవిహార్ హోటల్‌ను కొనడానికికూడా ముఖ్యమంత్రి ప్రయత్నాలు చేస్తున్నారు. నగరంలో పెద్ద రియల్ ఎస్టేట్ వ్యాపారి అయిన బషీరుద్దీన్ బాబూఖాన్ ఈహోటల్ భవనం యజమాని. చాలాకాలం నుంచి ఈహోటల్‌ను అమ్మాలని ముఖ్యమంత్రి బషీరుద్దీన్ బాబూఖాన్‌పై ఒత్తిడితెస్తున్నారని, అందుకు ఆయననిరాకరిస్తూవచ్చారని తెలిసింది. అయితే బాబూఖాను నుంచి చేసు కొనేయత్నంలో భాగంగా మొన్నటి ఎన్నికల్లో అసుపల్ దొడవ్ నుంచి తెలుగుదేశం టిక్కెట్టు ఇచ్చి గెలిపించారట. గెలిచిన తర్వాత ఆ హోటల్‌ను అమ్మాలని తిరిగి బాబూఖాను కోరగా అందుకు ఆయన నమ్మతించారని తెలిసింది. అయితే ముఖ్యమంత్రి ఇక్కడో చిన్న చిక్కును ఎదుర్కొంటున్నారు. ప్రస్తుతం వున్న జనరల్ పోస్టాఫీస్ భవనం ఇరుకుగావుండడంవల్ల అదనంగా కార్యాలయాల కట్టేందుకు వసంతవిహార్ హోటల్‌ను కేంద్ర ప్రభుత్వంతో సేకరింపజేసేందుకు రాష్ట్రతంతి తపాలా శాఖాధికారులు కూడా ప్రయత్నాలు చేస్తున్నారు. ఈ హోటల్‌ను కొనాలని ముఖ్యమంత్రి ఎంతపట్టుదలగావున్నారో, కేంద్రం స్వాధీనంచేసుకొనేట్లు చూడాలని అధికారులుకూడా అంతే పట్టుదలగావున్నారని పి. అండ్ టి. అధికార వర్గాలవారు చెప్పారు. —

### జనవాణి

(3వ పేజీ కొరవ)

లాండు. మరొకటి ఆరైతు ప్రకటించినట్లు ఎకరాకు 650 కిలోల అదనపు పంట ఇస్తుందనడం అతిశయోక్తి అనిపిస్తుంది. ఓక్స్ప్రేషన్ శాస్త్రజ్ఞులు చెప్పే ప్రకారం 72 రంటే 15 శాతం అధికపంట నిస్తుందట మనావన అనేది నెంటు ఏదైనా స్ప్రేచేస్తే రావలసిందే కాని దాని గుణాల్లో లేదని శాస్త్రజ్ఞులు చెప్తారు; ఇదీ సంగతి.

నెల్లూరు —ఒకరైతు

—

# పంచాంగం

### కర్తరి త్యాగము

28-5-85 వ తేది జ్యేష్ఠ శుద్ధ నవమి మంగళవారం కర్తరి త్యాగం.

### రోహిణికార్తె

7-6-85 వ తేది శుక్రవారం రాత్రి 12-56 గంటలవరకు రోహిణికార్తె వుండును.

### మే తిథులు

| | | | | |
|---|---|---|---|---|
| 25 | శని | షష్ఠి | తె 4-44 | గం. వ. |
| 26 | ఆది | సప్తమి | రా 3-25 | గం. వ. |
| 27 | సోమ | అష్టమి | తె 1-38 | గం. వ. |
| 28 | మంగళ | నవమి | రా 11-37 | గం వ. |
| 29 | బుధ | దశమి | రా 9-13 | గం. వ. |
| 30 | గురు | ఏకాదశి | రా 7-01 | గం. వ. |
| 31 | శుక్ర | ద్వాదశి | సా 4-35 | గం. వ. |

—నిమ్మగడ్డ వేంకటేశ్వరశాస్త్రి.

—

### జమీన్‌రైతు చందా

| | |
|---|---|
| సంవత్సరం చందా | 40-00 |
| ఆరునెలలకు ,, | 20-00 |

## ఉద్యోగములు

18 సం॥ పైన 22 సం॥ లోగా వయస్సు కలిగి, 8వ తరగతి వరకు చదివియున్న పురుషులనుండి చిన్న ఫ్యాక్టరీలో దిన వేతనముపై పనిచేయుటకు దరఖాస్తులు కోరబడుచున్నవి.

ఉద్యోగము ప్రస్తుతము తాత్కాలికము, పిదప ప్రకారము పనిచేయవలసి యుండును. దరఖాస్తుదారులు తమ పూర్తి పేరు, తండ్రి పేరు, పూర్తి అడ్రస్, వయస్సు మొదలగు వివరములతో యీ క్రింది అడ్రస్‌కు జూన్ 3 తేది లోగా దరఖాస్తులు పంపుకొనవలెను.

వి. సుబ్బరామయ్య

22-158 A. లక్ష్మీనగర్

నెల్లూరు - 2

In the Court of the 1st Addl. District Munsif, Nellore.

O. S. No. 544/83

Andhra Bank– Plaintiff

1. Dhurjeti Indiramma– Defendants

ఈ నెంబరు దావాలోని 1వ ప్రతివాదికి దావా సమనులు కోర్టు, పోస్టు ద్వారా పంపిన పర్యాయములు చేసినను బుద్ధిపూర్వకముగా evade చేయుచున్నందున Substitute Service ద్వారా నోటీసు ఇచ్చుటకు తే 17-6-85 దిన వాయిదా గాన ఆరోజు ఉదయం 11 గంటలకు పై కోర్టులో హాజరై ఆక్షేపణలు తెలుపుకొనిదుటల నీ పరోక్షమందు తీర్మానించబడునని తెలియచేయడమైనది.

–యస్. వి. సుబ్బారెడ్డి

వాది తరపు అడ్వకేటు



శ్రీకాళహస్తి ప్రధాన జిల్లా మునసబువారి కోర్టులో

E. P. No. 128/1983

O. S. No. 66/1981

స్టేట్ బాంక్ ఆఫ్ ఇండియా (ఎ డి బి) శ్రీకాళహస్తి –వాది

పేపాటి చెంగమనాయుడు వగైరాలు –ప్రతివాది

పైన కనిన నెంబరు డిక్రీ మొత్తము వసూలు నిమిత్తము గాను దులకుగాను మొదటి ప్రతివాది (J D R) తాలూకు క్రింది వివరించియుండు షెడ్యూలు ఆస్తులను 24-6-1985 తేదిన పగలు 11 గంటలకు పై కోర్టువద్ద బహిరంగముగా వేలము వేయబడును. పాటదారులు కోర్టుకు హాజరై పాడుకొనవచ్చును.

– షెడ్యూలు –

చిత్తూరు జిల్లా కొత్త పేట తాలూకాలో చేరిన విజయగోపాలపురం గ్రామములో మొదటి ప్రతివాది (J D R) బాధ్యపడియుండు భూముల వివరములు:

పట్టా నెం. 1 పట్టా నెం. 48 సర్వే నెం 288/1 విస్తీర్ణం 10.20 సెంట్లు హెక్టార్లు 4.131 మాజీ లేక మెట్ట Dry.

వాది క్రయం రూ. 15,000/-

కోర్టువారి క్రయం రూ. 20,200/-

వేలం వాయిదా తేది 24-6-1985

–ఇ. సత్యనారాయణ

DHR పరం అడ్వకేటు, శ్రీకాళహస్తి

## టెండరు నోటీసు

ఇందుకూరుపేట తాలూకా గుండ్లపాలెం గ్రామపంచాయితీకి ఈ దిగువ తెలియపరచిన వస్తువులు సప్లయి చేయుటకు సీలు టెండర్లు ఈ దిగువ సంతకము చేసిన వారిచే తేది 4-6-85 వ సాయంత్రము 4 గంటలకు లోపల స్వీకరించి అదేరోజు సాయంత్రము 4-30 గంటలకు హాజరైన టెండరుదార్ల సమక్షములో తెరువబడును. ప్రతి టెండరుకు డిపాజిట్టు చెల్లించి రశీదు జతపరచవలెను.

వ, నెం 1 వివరము 1985 - 86 సం॥కు వీధి దీపములకు కావలసిన 40 w ట్యూబులైటు పైపు బల్బులు 4 అడుగుల ట్యూబులు, చోకులు, స్టార్టర్లు, హోల్డర్లు, పైపు, ట్యూబు హోల్డర్లు దఫాలవారిగా సప్లయి చేయుట

డిపాజిట్టు రూ 50-00

వ నెం 2 1985 - 86 సం॥కు 1x4x40 w ట్యూబులైటు ఫిట్టరు మొత్తము సెట్టు క్లాంపులు బ్రాకెట్లతో సప్లయి చేయుట (పై రెంటికీ క్రాంప్టన్ కంపెనీ లేక రైజ్డ్ డీలర్లు మాత్రం)

డిపాజిట్టు రూ 50-00

వ నెం 3 1985-86 సం॥కు గొట్టపు బావులు విడిభాగములు దఫాలవారిగా సప్లయి చేయుట

డిపాజిట్టు రూ 20-00

**ఎం. చంద్రశేఖరరెడ్డి**

సర్పంచ్

గుండ్లపాలెం గ్రామపంచాయితి

# ✱ పెండ్లిండ్లు ✱

### బుచ్చి వివాహం

బుచ్చిరెడ్డిపాలెం —మృదుభాషి, సౌశీల్యమూర్తి ఎన్నికలలో గెల్పించడంతప్ప గెల్చే యోగం లేనవరని రాజకీయ రైతు శ్రీ బెజవాడ దశరధరామరెడ్డి కుమారుడు నరేష్‌చంద్ర; పొట్టేంపాడు శ్రీ మోపూరు రఘురామరెడ్డి తనయ ప్రత్యూష వివాహం 10 తేది రాత్రి చల్లని వేళ శ్రీ వెంకటేశ్వర కళ్యాణమంటపంలో కిటకిటలాడుతూ జరిగింది.

కాఫీ పెండ్లివాడు: తమ్ముని చిన్నరు పెండ్లి!

### నిర్మల వక్కపొడి

వ్యాపార విజయానికి, అదృష్ట జాతకానికి నెల్లూరులో 'నిర్మల' ఒక పాపులర్ పేరుగా, సంకేతంగా ప్రఖ్యాతికి తెచ్చిన తరహాలో, ప్రామాణిక స్టాండర్డు తగ్గించని వక్కపొడి జనకుడు, అంతస్తు పెరిగినా అణకువ వదలుకొనని వ్యాపారవేత్త శ్రీ బండి కొండారెడ్డి కుమార్తె శైలజ; చిన్నచెరుకూరు శ్రీ వేమారెడ్డి కోదండరామరెడ్డి కుమారుడు వెంకటరవిచంద్రారెడ్డి వరియ 11 తేది టవున్ హాలులో జనసందోహంగా జరిగింది.

### గూడలి వివాహం

గూడలివాసి, జేనేత వ్యాపారి, ఒడిదుడుకులు లేని మిత్రుడు శ్రీ అవలం వాసుదేవయ్య కుమారుడు వెంకటశివయ్య ఎం. ఏ., ఎం. ఫిల్. కడప, రిటైర్డ్ డిప్యూటి కలెక్టరు శ్రీ కె. శివశంకరం కుమార్తె విజయలక్ష్మి. బి ఏ., వివాహం 10 తేది నెల్లూరులో శ్రీ కస్తూరి దేవి విద్యాలయంలో జరిగింది.

కార్యనిర్వాహకులు - అందరి వాంఛితులు అంటుంటారే ఈ పెండ్లికి నేదురుమల్లివారే వారని అనిపించింది: శ్రీ జనార్దనరెడ్డి మొదలు అందరూ వచ్చి బంధుంగా హాజరైవుండినారు.

### బి. ఇడి. ల పెండ్లి

అమ్మాయి అనసూయ బి ఎస్‌సి., బి ఇడి.-నెల్లూరు— మునిసిపల్ డాక్టరు శ్రీ కె శ్రీనివాసరావు ఎల్. ఐ. ఎం. కుమార్తె: అబ్బాయి ప్రసాద్ ఎం. ఎస్‌సి., బి. ఇడి. -నెల్లూరు శ్రీ కె. శేషయ్య కుమారుడు.

ఈ బి. ఇడి. ల వివాహం 11 తేది నవాబుపేటలోని శ్రీ కామిశెట్టి వారి సత్రంలో జరిగింది.

### తిక్కవరపు - జక్కా

ఊర్లు మారాయి కాని, ఇంటిపేర్లు మారలేదు, మనుషులూ మారలేదు!

నెల్లూరులో స్థిరపడిన లేబూరు వ్యవస్థాపకుడు శ్రీ తిక్కవరపు బాలకృష్ణారెడ్డి కుమార్తె కృష్ణవేణి; కాళయకాగొల్లు వదలి మద్రాసు వాసియైన శ్రీ జక్కా చంద్రశేఖరరెడ్డి కుమారుడు వెంకటేశ్వర రెడ్డి కళ్యాణం 1? తేదీ శ్రీ వెంకటేశ్వర కళ్యాణమంటపంలో జరిగింది.

### సిక్కు సోదర, కళ్లు తెరు!

– కె. ఆదిశేషయ్య

కన్నుది చూడలేవు,
చెప్పింది వినలేవు
ఇందిరమ్మ మరణవార్త
శృంగదీసె జాతినంత

దేశఖ్యాతి ఇనుమడించ
జాతిమంత పులకరించ
కాంగిరేసు పటపండి
లీడరయ్యె రాజీవ్‌గాంధి

అమ్మదైక్యం - జాతకాంతం
ముఖమునందు తేజరిల్ల
సమసమాజ స్థాపనకు
దీక్షబూనె ధీరశాలిగాంధి.

పెత్తరిష్టులంట ఎవరో బాబు
నీకుగడ్డ జన్మనెత్తిన పుణ్యమలు
జాతియంత చీక్కరించ
పచ్చినెత్తుట జాడ్యతులంత

రోజులన్ని పోయినావు
కాలం తిక్క కలిసివస్తే
నింగి నేల కలిసినట్లు
జాతియంత వెంటరాగా

పెత్తరిష్టు....ఏమౌతావు?
సిక్కుసోదర కళ్ళుతెరు!

### బిట్రగుంట పెండ్లి

కావలియాపాదు, శ్రీ బి మల్లారెడ్డి చంద్రశేఖరయ్య కుమార్తె అనూరాధ; బిట్రగుంట రైల్వేఉద్యోగి శ్రీ తలమంచి వెంకటసుబ్బయ్య కుమారుడు నాగరాజా వివాహం 10 తే రాత్రి బిట్రగుంటలో జరిగింది.

### జి. ప. పెండ్లి

జిల్లాపరిషత్తు ఉద్యోగి శ్రీ వల్లూరు రామకృష్ణయ్య కుమార్తె హైమవతి (బి కాం): తోటపల్లిగూడూరు శ్రీ కోడవల్లి పిచ్చయ్యనాయుడు కుమారుడు, పాలిటెక్నిక్ అసిస్టెంటు లెక్చరరు నారాయణ ఎం. కాం., వివాహం 12 తేది శివకంచివారి కళ్యాణ నిలయంలో జరిగింది,

### గూడూరు వివాహం

గూడూరు స్వర్గీయ ఎల్లసిరి వెంకురెడ్డి కుమారుడు, అంటే శ్రీ నెంబ్రి సుందరరామిరెడ్డి మేనల్లుడు కవీంద్రనాథ్; పోట్లపూడి శ్రీ పి. రఘునాథరెడ్డి కుమార్తె అనిత వివాహం 11 తేది గూడూరులో జరిగింది.

# జిల్లావార్తలు (మరికొన్ని)

### అల్లూరు లైన్స్ శిబిరం

అల్లూరు లయన్స్‌క్లబ్ ఇటీవల ఓపి ల్యాప్ శిబిరం నిర్వహించింది. నెల్లూరు డాక్టర్లు తులసి, రాజేశ్వరి, కె పి, వరోజినీ బాయి 80 మంది స్త్రీలకు, ముగ్గురు పురుషులకు ఆపరేషన్లు చేశారు, డాక్టర్ సంగప్ప, డాక్టర్ రాధాదేవి తదితరులు సహకరించారు. అల్లూరు ప్రభుత్వ ఆస్పత్రి మెడికల్ ఆఫీసరు డాక్టర్ వి. వి. కృష్ణారెడ్డి శిబిరం నిర్వహించారు. లయన్స్‌క్లబ్ ఆపరేషన్లు చేసుకున్నవారందరికీ స్టీలు లోటాలు బహూకరించింది.

మే 29 తేది కూడా ఇంకొక శిబిరం నిర్వహిస్తారట అల్లూరులో!

### వాకాడు ఎస్జీటీల ఆక్రందన

వాకాడు తాలూకాలో ఇటీవల ఎస్జీటీలపై దాడులు పెరిగిపోతున్నాయని తాలూకా ఎస్జీటీ సంఘం ఆందోళన వ్యక్తం చేసింది, మల్లాం రెవిన్యూ ఇన్స్‌పెక్టర్, కలెక్టర్ ఆదేశం మేరకు చెరువులో అక్రమంగా సంపులు పెట్టి సేద్యం చేసుకుంటున్న రైతులను నివారించబోయాడట; రైతులు అందుకాయనపై దౌర్జన్యం చేశారట, పోలీసులకు ఫిర్యాదు చేసినా ఫలితం లేకపోయిందట.

గతంలో తపాలా డబ్బు పంపకం చేయబోయిన పంచాయతీ ఇ ఓ శ్రీ పి. వెంకట్రామ్‌పైకూడా దాడి జరిగింది, ఎస్జీటీలకు ప్రభుత్వం రక్షణ కల్పించని పక్షంలో ప్రత్యక్ష చర్యకు దిగవలసి వస్తుందని సంఘం కార్యదర్శి శ్రీ కె. రాధాకృష్ణమూర్తి హెచ్చరించారు.

### కావలి తెలుగుదేశం సింహావలోకనం

కావలి శాసనసభ ఎన్నికలలో తమఓటమికి కారణాలువెతకడానికి తెలుగుదేశం పార్టీ వర్గాలు ఒక చిన్న సమావేశం ఏర్పాటు చేసుకున్నారు. శ్రీ మస్తాన్ నాయుడు అధ్యక్షత వహించారు.

అభ్యర్థి నిర్ణయంలో అధిష్ఠానవర్గం చేసిన జాప్యం, పాతపాళ్లు స్థానికంగా కొందరు పెద్దలు సమ్మె లోటు పాటించడం ఓటమికి కారణమని తేల్చారట,

ఈ సమావేశానికి కొండపనాయుడు డాక్టర్ ప్రభాకరనాయుడు వంటి నాయకుల గైర్‌హాజర్ విశేషంగా భావిస్తున్నారు.

ఈ సమావేశంలోనే తాలూకా తెలుగుదేశం నాయకత్వం సమన్యకూడా ప్రస్తావనకువచ్చింది. చాలామందికి ఆశ పుట్టిందట. —

నెల్లూరులో వెలసిన సాంస్కృతిక సంస్థ కళాభారతి ప్రారంభోత్సవం– కుడివైపు ప్రారంభకులు, జిల్లాజడ్జి బి. శివసాంబమూర్తి: ఎడమవైపు సంస్థ స్థాపకులు రొటేరియన్ ఎం. శంకరప్రసాద్.



# కన్నీటి నివాళి

ఏ వ్యాపారము చేసినా "మంచిని పెంచు - మంచిని పంచు"
అనే ధర్మసూత్రాన్ని పాటించిన మా మామ

## శ్రీ ఎస్. రాధాక్రిష్ణయ్య

( కోట తాదయ్య, ఎక్సైజు కాంట్రాక్టరు )

ఒంగోలు వద్ద తేది 13-5-85 జరిగిన కారు ప్రమాదంలో మరణించినారు
ఎన్నడూ చెరగని తన చిరునవ్వుల వెన్నెలతో.
అభిమానానురాగాలతో మా హృదయాల ప్రమిదల్లో
జ్యోతులు వెలిగించిన ఆ అమృతమూర్తి ఆత్మకు
శాంతి కలుగవలెనని శోకతప్త హృదయాలతో కోరుకుంటున్నాము,

కంచి సురేంద్రరావు సుబ్రహ్మణ్యం సుధాకర్ సూర్యప్రకాష్
ప్రేమలత నిర్మల జయలక్ష్మి సుధ

Edited, Printed & Published by N. Sree Ramamurthy at The Zamin Ryot Press, Thipparajuvari Street, Nellore (A. P.)